## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990175504

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నెహ్రూ బాల పుస్తకాలయం

# విరిగిన రెక్క
# కొన్ని ఆసియా కథలు

రచన

శెలిందర్ ధనోవా

బొమ్మలు

పాలిన్ ధనోవ

అనువాదం

ఎమ్. వి. చలపతిరావు





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ : 1983 (శక 1904)
తృతీయ ముద్రణ : 1990 (శక 1912)

THE BROKEN WING AND OTHER ASIAN TALES (Telugu)
రూ. 6-50
డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా,
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ-110016
చే ప్రచురింపబడినది.



# విరిగిన రెక్క

కొరియన్ జానపద కథ

పూర్వం ఒక ముసలివాడు ఉండేవాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దవాళ్ళు ఇద్దరూ కురూపులు, సోమరులు. చిన్నవాడు అందగాడు మంచివాడు. కష్టించి పనిచేసేవాడు. కష్టించి పని చేయటంవలన బక్కగా ఉండేవాడు. ముసలివాడికి కొడుకులందరిలో చిన్నవాడు ఇల్‌చుంగ్ అంటే ప్రాణం. అందువలన పెద్దవాళ్ళిద్దరికీ తమ్ముడంటే కోపము. అసూయ.

పాపం ఒకరోజు ఇల్‌చుంగ్‌ను పెద్దవాళ్ళయిన అతని అన్నల దయాదాక్షిణ్యానికి వదలి ముసలివాడు కన్నుమూసాడు. ఇల్‌చుంగ్ తండ్రి మరణానికి విచారంతో క్రుంగిపోయి ఎంతో ఏడ్చాడు.

"చాలు: చాలు! నీ దొంగ ఏడుపు కట్టిపెట్టు!" అన్నాడు పెద్దవాడు టాంగ్ టోంగీ.

"ఆ, నీ దొంగ ఏడుపు ఆపు!" అని తన అన్నమాటలనే వంతపాడాడు రెండవ వాడు సల్ సారీ. సల్ సారీ పట్టి మందమతి. స్వయంగా ఆలోచించలేడు. అందేత అన్న టాంగ్ టోంగీ మాటలనే వల్లించేవాడు.

"నీ దిక్కుమాలిన ముఖం ఇక నేను చూడలేను," అని ఇంకా క్రూరంగా తిట్టాడు టాంగ్ టోంగీ

"నేను చూడలేను....," అని సల్‌సారీ అంటూనే వున్నాడు. అతను ఆ వాక్యం పూర్తి

చేయక ముందే టాంగ్‌టోంగీ ఇల్‌చుంగ్‌ను మెడ పట్టుకొని ఇంటినుంచి బయటకు గెంటాడు. "ఇదుగో, తీసుకో. నాన్నగారి ఆస్తిలో నీకు వచ్చే వాటా ఇంతే" అంటూ ఎండిపోయిన ఒక గొడ్డె ముక్కను అతని ముఖాన విసిరేశాడు.

ఇల్‌చుంగ్ దుస్థితికి నవ్వుకుంటూ చెట్టాపట్టాలు వేసుకుని ఇద్దరు అన్నదమ్ములూ ఇంట్లోకి వెళ్ళారు.

క్రూరులైన అన్నలిద్దరినీ బ్రతిమాలి లాభం లేదు అని ఇల్‌చుంగ్ దగ్గరలో ఉన్న అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. అతను వివేకి, బుద్ధిశాలి. త్వరలోనే చిన్న ఇల్లు కట్టుకోవటానికి కావలసిన కర్రలు, గడ్డి ప్రోగు చేశాడు. తల దాచుకునేందుకు నాలుగు గట్టి గోడలు, శుభ్రమైన కప్పుగల ఇల్లు కట్టుకోవడానికి అతనికి ఎంతోకాలం పట్టలేదు.

అతనిది సహజంగా ఆనందంగా ఉండే స్వభావం. అంచేత దొరికిన దుంపలు, పండ్లు తింటూ తృప్తిగా కొంతకాలం గడిపాడు. కాని చలికాలం దగ్గరపడుతున్నకొద్దీ ఆ చిన్న యింట్లో తను చలినుంచి బాధపడవలసి వస్తుందని అతను గ్రహించాడు.

ఒక రోజున ఇల్‌చుంగ్‌కు బాగా ఆకలివేసింది. ఉదయం అంతా పండ్లకోసం వెతికాడు అయినా మధ్యాహ్నానికి గుప్పెడు పండ్లుమాత్రమే దొరికాయి. వాటితో తన ఆకలి తీరదు అని తదేక దృష్టితో విచారంగా వాటివంక చూశాడు నిట్టూరుస్తూ ఇంటివైపు మళ్ళాడు. దారిలో అకస్మాత్తుగా గాయపడిన ఒక పక్షి పడి ఉండటం అతను గమనించాడు.

దాన్ని చూడటానికి అతను క్రిందికి వంగాడు. అతను తనకు హాని చేస్తాడేమోనని భయంతో ఆ పక్షి రెక్కలు టప టపలాడించింది. కాని ఇల్‌చుంగ్ దాని తల మృదువుగా నిమిరాడు. దగ్గరగా తీసుకొని చూస్తే పక్షి రెక్క ఒకటి విరిగి ఉంది.

ఇల్‌చుంగ్ పక్షిపిల్లని తీసుకుని గబ గబ ఇంటికి వెళ్ళాడు గడ్డితో మెత్తని పడక వేసి తన సంగతే పట్టించుకోకుండా తాను తినడానికి ఏరిన పండ్లు దానికి పెట్టాడు.

అతని సంరక్షణలో పక్షి త్వరగా కోలుకొని ఒకరోజు ఉదయం ఎగిరిపోయింది. ఆ పక్షి వెళ్ళిపోవటం చూసి ఇల్‌చుంగ్ విచారపడ్డాడు. అతనికున్న నేస్తం ఆ పక్షి ఒక్కటే. ఆ పక్షంటే అతనికి ప్రాణం.

మరునాడు ప్రొద్దుటే తన వాకిటి ముందర పరిచితమైన కూత విని అతను ఆశ్చర్యపడ్డాడు. బయటికి వచ్చిచూస్తే తన నేస్తం ఆ పక్షి తిరిగి వచ్చింది.

దాని ముక్కున చిన్న విత్తనం ఉంది. విత్తనాన్ని ఇల్‌చుంగ్ కాళ్ళదగ్గర పడవేసి, "నీ దయకు కృతజ్ఞురాలిని. దీన్ని నాటు నీకు అదృష్టం కలుగుతుంది" అంది.

ఇల్‌చుంగ్ ఇంకా కొన్ని ప్రశ్నలు అడిగేలోగా పక్షి తుర్రున ఎగిరి పోయింది. విత్తనాన్ని తీసుకొని ఇంటి వెలుపల నాటాడు అతను.

మరునాడు ఉదయం నిద్ర మేలుకుని చూస్తే గది ఇంకా చీకటిగానే ఉంది. చాలా పెందరాళే మేలుకున్నానేమో అనుకొని ఆశ్చర్యపడుతూ. సూర్యుడు ఉదయించాడో లేదో చూద్దామని మంచంమీంచి గబుక్కున లేచాడు బయటకు తొంగిచూడగానే మెత్తని పెద్ద ఆకు ముఖానికి తగిలింది. దాన్ని పక్కకు నెట్టాడు. పచ్చని ఆకులు ఇంకా ఎన్నో కనిపించాయి. వాటిని ప్రక్కకు నెట్టుకుంటూ ఆకుల మధ్య నడుస్తూ ఉంటే సన్నని తీగలు ఇల్‌చుంగ్ ముఖానికి చుట్టుకొని చెవులకు గిలిగింతలు పెట్టాయి.

"ఓహో! ఇది గుమ్మడిమొక్కలాగుందే!" అనుకొన్నాడు.

తాను ఇంతకు ముందు చూసిన మొక్కలకంటె పెద్దది గుడిసెపైన క్రింద కను చూపుమేర వరకు అల్లుకుని వుంది. దట్టమైన పచ్చని ఆకులమధ్య పెద్దవి, తియ్యనివి చాలా గుమ్మడికాయలు ఉన్నాయి.

ఆహారం కోసరం అడవిలోకి వెళ్ళనవసరం లేదని సంతోషించి ఒక గుమ్మడికాయ కోసి ఇంట్లోకి తీసుకుపోయాడు.

గుమ్మడికాయను కోయటం మొదలెట్టగానే దానిలోంచి ఒక వెలుగు తళుక్కుమంది. గుమ్మడికాయ రెండు చెక్కలవటంతోనే దానిలోంచి బంగారు నాణాలు ప్రవాహంలా దొర్లుతూ నేలమీద రాలాయి. ఇల్‌చుంగ్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

ఇంకా కోయవలసిన గుమ్మడికాయలు ఎన్నో ఉన్నాయి—ఒక్కో దానిలో ఎంతో బంగారం!

తన అదృష్టానికి పొంగిపోతూ రెండు పెద్ద గుమ్మడికాయలు తీసుకొని అన్నల ఇంటికి పరుగెత్తాడు ఇల్‌చుంగ్. తన పట్ల ఎంత క్రూరంగా ప్రవర్తించినా తన సంతోషాన్ని వాళ్ళతో పంచుకుందామనుకున్నాడు.

కానుకలతో వాళ్ళ ఇంటికి చేరుకునే సమయానికి అన్నలిద్దరూ పెద్దగా గురక పెడుతూ నిద్రపోతున్నారు.

గుమ్మడికాయలు బల్లమీద ఉంచి "మీ కోసరం ఏం తెచ్చానో చూడండి" అన్నాడు ఉద్రేకంగా.

టాంగ్‌టోంగీ ఒక కన్ను తెరచి గుమ్మడికాయలను చూసి, అహంకారంతో కను బొమ్మలు ఎగరేసి నవ్వాడు.

"ఆ, ఏం గుమ్మడికాయలేగా" అన్నాడతను.



సల్‌సారీ గూడా ఆవులించి బద్ధకంగా కనుబొమ్మలు ఎగరేసి "ఏం. ఇవి·········అంటూ మొదలెట్టాడు.

"నీ గుమ్మడి కాయలు మాకేం అక్కర్లేదు మా పొలాల్లో చాలా ఉన్నాయి" అన్నాడు టాంగ్‌టోంగీ ఇల్‌చుంగ్‌తో.

సల్‌సారీ కూడా టాంగ్‌టోంగీతోడాను. "గుమ్మడికాయలేగా మాకు అక్కర్లేదు. మా దగ్గర చాలా ఉన్నాయి" అన్నాడు.

"కానీ టాంగ్‌టోంగీ, ఇవి మామూలు గుమ్మడికాయలు కాదు. చూడు అని అంటూ ఒకగుమ్మడికాయను కోసాడు ఇల్‌చుంగ్. దాంతో బంగారునాణాలు దొర్లి బయటకు వచ్చాయి.

అప్పుడు టాంగ్ టోంగీ, సల్‌సారీ ఒక్క ఉదుటున లేచారు—తమ జీవితంలో ఎన్నడూ వారంత వేగంగా కదలలేదు. బంగారు నాణాలు దొర్లిన చోటికి పరుగున వెళ్ళి అత్యాశతో చేతుల్లోకి తీసుకున్నారు. ఆత్రంగా రెండో గుమ్మడికాయను కోసి దానిలోని బంగారు నాణాలను చేతి వ్రేళ్ళతో గుచ్చి ఎత్తారు.

"హ: హి! దీనివల్ల ఇక మనం కష్టపడి పనిచేయనవసరంలేదు. హాయిగా కాలం వెళ్ళబుచ్చవచ్చు" అని వాళ్ళిద్దరూ ఇకిలించారు.

తన అన్నలిద్దరికి ఇల్‌చుంగ్ రెక్క విరిగిన పక్షిని గురించి చెప్పాడు. ఆ కథ విని వాళ్ళిద్దరి మనసులు అసూయతో నిండిపోయాయి.

ఆలోచిస్తూ తల గోక్కున్నాడు టాంగ్‌టోంగీ. దీర్ఘాలోచనలో మునిగి ఇల్‌చుంగ్ అక్కడే నిలబడి ఉండటం గమనించాడు. అతన్ని ప్రక్కకు త్రోసి, "ఇప్పుడుగూడ నీతో మాకేం పనిలేదు. వెళ్ళిపో" అన్నాడు.

ఇల్‌చుంగ్ విచారంగా తిరుగుముఖం పట్టాడు. తన అన్నలు మళ్ళీ తనను ఇంటికి తిరిగి రానిస్తారని అనుకున్నాడు. కాని వాళ్ళు తనను ఇంకా ద్వేషిస్తూనే ఉన్నట్లు తెలిసింది.

ఇల్‌చుంగ్ వెళ్ళిన తర్వాత "సల్‌సారీ" అని అతన్ని పిలిచాడు టాంగ్‌టోంగీ.

సమాధానం లేదు.

కోపంగా, "సల్‌సారీ! ఎక్కడున్నావు?" అని బిగ్గరగా మళ్ళీ కేక వేశాడు

తన సోమరి తమ్ముడు సల్‌సారీ బంగారు నాణాలమీద తలపెట్టి నిద్రపోతూ సన్నగా గురకపెట్టడం కనిపించింది

అతన్ని డొక్కలో ఒక్క తన్ను తన్నాడు. దాంతో సల్‌సారీ కోపంతో కుయ్యో మంటూ లేచాడు.

"విను, మొద్దు," అన్నాడు టాంగ్‌టోంగీ సమాధానంగా సల్‌సారీ మరోసారి గుర్రుమన్నాడు. "వంగు బాగా వినపడుతుంది," అధికారయుతంగా అన్నాడు టాంగ్‌టోంగీ. టాంగ్‌టోంగీ పొట్టిగాను, లావుగాను వుంటాడు. సల్‌సారీ పొడవుగాను సన్నగాను ఉంటాడు. టాంగ్‌టోంగీ ఎక్కడో క్రిందనుంచి చెప్పేది వినిపించదని సల్‌సారీ తరుచు ఫిర్యాదుచేసేవాడు.

టాంగ్‌టోంగీ చెప్పింది వినడానికి సల్‌సారీ వినయంగా క్రిందికి వంగాడు. శ్రమకు ప్రతిఫలంగా లభించింది ముక్కుమీద ఒకదెబ్బ. అన్నగారి యీ క్రూర ప్రవర్తనకు సల్‌సారీ ఏమీ అనలేదు. టాంగ్‌టోంగీ ప్రవర్తనకు అతను అలవాటు పడిపోయాడు. ఈ అన్నదమ్ము లిద్దరిలో పెద్దవాడు తెలివిగలవాడు. తన బుర్రతో ఆలోచించడం కష్టం అని తెలుసుకొన్న

సల్సారీ తరుచు ముక్కుమీద దెబ్బలు తగులుతున్నా, అన్నగారి ఆజ్ఞలను పాటించడంతో తృప్తిపడేవాడు. నిజానికి వాళ్ళిద్దరూ పరస్పరం అర్థం చేసుకునేవారు.

టాంగ్‌టోంగీ తన మందమతి తమ్ముణ్ణి రెక్క విరిగిన పక్షిని వెతకడానికి వెంటనే అడవికి పొమ్మని ఆజ్ఞాపించాడు.

"వట్టి చేతుల్తో ఇంటికి తిరిగి వచ్చావో, నీ పని పడతాను" అని బెదిరించాడు. సల్సారీ వెళ్ళాక టాంగ్‌టోంగీ బంగారు నాణాలను లెక్కపెట్టడం మొదలెట్టాడు.

సాయంత్రం అవుతున్న కొద్దీ సల్సారీకి బెంగపట్టుకుంది. రెక్కవిరిగిన పక్షి యింకా కనిపించలేదు. అది లేకుండా ఇంటికివెళితే తగిలే దెబ్బలు తలుచుకొని ముక్కు అదిరింది, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

చివరకు మెరుపులాంటి ఒక ఆలోచన తట్టి అటుగా ఎగిరిపోతున్న ఒక పక్షిని పట్టుకొని దాని రెక్కల్లో ఒకదాన్ని విరిచాడు. విజయగర్వంతో పక్షిని టాంగ్‌టోంగీ దగ్గరకు తీసుకుపోయి ఆ పక్షి ఎలా దొరికిందీ వివరించాడు.

"రెండో రెక్కకూడా విరిచేయవచ్చు" అని సలహా ఇచ్చాడు. అందుకు ముక్కుమీద మరో దెబ్బ



పడింది. సల్‌సారీని ముక్కుమీద కొట్టడానికి ఎగిరి గంతు వేయడంతో టాంగ్‌టోంగి పొట్ట ఎంత ఊగిసలాడిందో.

అన్నదమ్ములిద్దరూ మూలికలతో, పండ్లతో పక్షికి ఉపచర్యలు చేశారు. కానీ దాని గాయం మానడానికి ఎక్కువకాలం పట్టడంతో కోపం వచ్చినప్పుడు అనేకసార్లు దాన్ని తిట్టిపోశారు.

చివరికి ఆ పక్షి కోలుకొని ఆ దురాశాపరులిద్దరికీ ఆనందాన్ని కలిగిస్తూ ఎగిరిపోయింది. మరునాడు ముక్కున ఒక విత్తనాన్ని కరుచుకొనివచ్చి టాంగ్ టోంగి పాదాల దగ్గర పడేసింది.

ఆ విత్తనాన్ని చాలా జాగ్రత్తగా నాటారు వాళ్ళు. దాని వలన లభించే పంటను తలచుకొంటూ రాత్రంతా నిద్రపోలేదు. మరునాడు ఉదయం తాము ఆశించిన దానికంటే మొక్క పెద్దదిగా పెరగటం చూసి మురిసిపోయారు.

సంతోషంగా గుమ్మడికాయలను ఇంట్లోకి చేరవేయడం మొదలెట్టారు. పీరైనన్ని ప్రోగుచేసి కత్తి తీసుకుని మొదటి గుమ్మడికాయను కోసారు.

మెరిసే బంగారు నాణాలకు బదులు సన్నని పాములు, బల్లులు, కప్పలు ప్రాకుతూ బయటకు వచ్చేసరికి వాళ్ళ బంగారు చెప్పనలవికాదు. భయంకరమైన ఆ దృశ్యం చూసి ఆ గుమ్మడికాయను పారవేసి మరోదాన్ని కోసారు. కాయ తరువాత కాయ, ఇలా అన్నింటిలోను అవే మెలికలు తిరుగుతూ కనిపించాయి.

కొద్దిసేపట్లో పాములు గది అంతా పాకి వాళ్ళ కాళ్ళకు చుట్టుకోసాగాయి. అన్నదమ్ము లిద్దరూ హడలెత్తి కేకలు వేస్తూ కాలికొద్దీ బయటకు పరుగెత్తారు.

ఇంట్లోంచే పారిపోయి అడవిగుండా పరుగెత్తారు. ఆ తరువాత వాళ్ళు మరి ఎవరికీ కనిపించలేదు. బహుశ దేశంనుంచే పారిపోయారేమో.



# కోపించిన రాజు

ఫిలిప్పీన్స్ జానపద కథ

దక్షిణ లూజాన్ కొండ ప్రాంతంలోని ప్రజలు పొగాకు పండించే వారు. ఆ ప్రాంతాన్ని చాలా రోజుల క్రితం హార్ కా బస్కుడ్ అనే రాజు పరిపాలించాడు. అతను చాలా తెలివి గలవాడు. అతని పరిపాలనలో రాజ్యంలోని ప్రజలందరు సుఖసంపదలతో జీవించే వారు.

పొగాకు పండించేవారి దగ్గరకు వెళ్ళి పైర్లను సంరక్షించుకోవడానికి సలహాలివ్వడం రాజు నీచంగా భావించే

వాడు కాదు. తత్ఫలితంగా ఆ దేశంలో అతని రాజ్యం విస్తారమైన మంచి పంటకు పేరు పొందింది. చుట్టుపక్ల రాజ్యాలలోని ప్రజలు కొన్ని మైళ్ళనుంచి వచ్చి తమ దగ్గర ఉన్న వస్తువులను ఇచ్చి వాటికి బదులుగా హారీ కా బస్కీద్ రాజ్యంలోని బంగారు రంగు పొగాకును తీసుకు పోతుండేవారు.

ఒక రోజు రాజుగారు రాజ్యంలోని పెద్దలందరితో ఒక సమావేశం ఏర్పాటు చేసాడు. "నేను చాలాదూర ప్రయాణం చెయ్యబోతున్నాను చుట్టుపట్ల ఉన్న రాజులతోనే గాక దూర ప్రాంతంలోని రాజ్యాలలో కూడ పనులున్నాయి. అందువలన నా ప్రయాణం ఎక్కువ రోజులు పడుతుంది. నేను ఎప్పుడు తిరిగి వస్తానో తెలియదు" అన్నారు.

పొగాకు పంట కోతకి వచ్చే సమయానికి వాళ్ళ రాజుగారు తమ దేశంలో ఉండక పోవడాన్ని గూర్చి అక్కడ ఉన్న వారందరూ విచారం వెలిబుచ్చారు.

"పంటలుకోసే సమయంలో జరిగే వేడుకల్లో నేను ఇక్కడ లేకుండా పోవడం నాకూ బాధగానే ఉంది ఇక్కడ ఉన్న మీరందరూ అంతా సవ్యంగా సాగి పోయేలా చూస్తారని నమ్ముతున్నాను. నేను త్వరలో తిరిగి రాకపోతే వచ్చే సంవత్సరం మొక్కలు నాటి పని మామూలుగా సాగి పోయేలా చూడండి. ఎప్పటిలాగే మంచిపంట దిగుబడితో చిరకాలం మన దేశం మంచి పొగాకుకు పేరు పొందేటట్లు చేయండి" అన్నారు రాజుగారు.

ఆ మరునాడే రాజు గారు ప్రయాణమై వెళ్ళిపోయారు రాజు గారు ఏయే దేశాలకి వెళుతున్నారో అని అందరూ ఆశ్చర్యపోయారు.

"ఈ కొండ అవతలకు వెళుతున్నారు" అన్నాడు ఒకడు.

"కాదు, గ్రద్ద కంటికి కూడ కనిపించని సముద్రాలకు అవతలి దూర ప్రాంతాలకు వెళుతున్నారు" అన్నారు కొందరు.

కానీ రాజు గారు తన ప్రయాణాల్ని గురించి ఎవరికీ చెప్పకపోవడం వల్ల ఆయన ఎక్కడకు వెళ్ళారో ఎవరూ ఖచ్చితంగా చెప్పలేక పోయారు.

కోతల సమయం వచ్చింది. ప్రజలు ఊహించిన దాని కంటే పంటబాగా పండింది.

"మన రాజుగారు మంచివారు. మనకు మంచి పంట పండించడం నేర్పారు." అనుకున్నారు ప్రజలు.

ఆ సంవత్సరం పండిన పొగాకును ప్రతి ఒక్కరూ మెచ్చుకున్నారు. హారీ కా బస్కీద్ రాజ్యంలోని ప్రజలందరూ ఇంతకు ముందు కంటె సంపన్నులై పోయారు.

"అంతా బాగానే ఉంది. అయినా మనం రాజుగారి ఆదేశాలను మరిచి పోకూడదు" అన్నారు పెద్దలందరూ.

క్రొత్తపైరు నాటడానికి వెంటనే అందరూ కొండ ప్రాంతంలో పనిచేయడం మొదలెట్టారు వాళ్ళ శ్రద్ధ, శ్రమ రాజుగారు ఉంటే చూసి గర్వించే వారు.

పది సంవత్సరాలపాటు ప్రజలు శ్రమించారు. ప్రతి సంవత్సరం క్రితం సంవత్సరం కంటే మంచి పంట పండేది. అయినా రాజుగారు పర్యటన నుంచి తిరిగి రాలేదు. క్రమంగా ప్రజలకు రాజుగారు జ్ఞాపకంగా మిగిలి పోయారు.

రాజుగారు వెళ్ళిన నాటికంటె ప్రజలు పదిరెట్లు భాగ్యవంతులు కావడంవల్ల ఆయన తన రాజ్యానికి తిరిగి వచ్చి దాన్ని గుర్తుపట్టలేకపోయినా ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

పూరి గుడిసెలు పెద్ద పెద్ద భవనాలై పోయాయి. ప్రజలందరూ మేలిమి వస్త్రాలు ధరించసాగారు.

పొగాకు పండించే వాళ్ళు పొలంపని చేయటానికి అయిష్టత చూపడం మొదలెట్టారు. బహుశ అందువల్లనే పరిస్థితుల్లో మార్పు వచ్చిందేమో।

"పొలం వెళ్ళి మట్టిలో పనిచేసి మంచి బట్టలు పాడుచేసుకోవడం బాగులేదు" అనుకున్నారు అందరూ.

పొగాకు పొలాలు నిర్లక్ష్యం చేయబడ్డాయి. బంగారం వంటి మొక్కలు పెరిగే తోటలు ఎండిపోయి దుమ్ము కొట్టుకు పోయాయి. పంటలు దిగుబడి తగ్గిపోవడంలో ఆశ్చర్యకర మేమీ లేదు.

పొగాకు కొనడానికి వచ్చిన వర్తకులతో "ఈ సంవత్సరం పంటబాగాలేదు" అన్నారు అక్కడి ప్రజలు.

నిజానికి ఆ సంవత్సరం పంట బాగాలేదు. కానీ పరిస్థితులు చక్క దిద్దాలని ఎవరూ



ఎట్టి ప్రయత్నం చేయలేమ. ప్రజలంతా వాళ్ళ బట్టలు, దుబ్బును కాపాడు కోవడంలో శ్రద్ధ వహించడంతో పొగాకు చేలు నిర్లక్ష్యం అవుతూ వచ్చాయి.

కొద్ది సంవత్సరాలలో రాజ్యం అంతా ఊహించలేనంత పేదదేశమై పోయింది. చాల కాలం నిర్లక్ష్యం చేయబడిన పొలాలు కొద్దిపంట గూడ ఇవ్వలేకపోయాయి.

"ఆకలితో చచ్చిపోయేలాగున్నాం." అన్నారు స్త్రీలు.

"మేము మీ కంటె ఏం బాగున్నాం?" అన్నారు పురుషులు కోపంగా.

పొలాలు సాగుచేయడానికి ప్రాధాన్యమివ్వక వాళ్ళు ఇంట్లో కూర్చుని దెబ్బలాడు కోవడం మొదలెట్టారు. క్రమంగా వాళ్ళ భవనాలు వాటి ఔన్నత్యాన్ని కోలుపోయినాయి. అయినా ప్రజలు సోమరులుగానే ఉండి పోయారు.

భూకంపం తప్ప మరేది వాళ్ళ సోమరితనాన్ని పోగొట్ట లేదు లావుంది. ఆశ్చర్యం ఏమిటంటే సరిగ్గా ఆ భూకంపమే వచ్చింది.

భూమి కంపించి పెద్దగా గర్జించింది. భయంతో ప్రజలందరూ ఇళ్ళల్లోంచి బయటకు పరుగెత్తారు. కొన్ని సంవత్సరాలుగా ఎవరూ అంత వేగంగా పరుగెత్త లేదు. పురుషులు, స్త్రీలు, పిల్లలు పెద్దవాళ్ళు పెడుతూ కొండల ప్రక్కగా పరుగెత్తారు.

"ఆగండి." అంటూ అకస్మాత్తుగా, ఒక కంఠం ఆజ్ఞాపిస్తున్నట్లు గర్జించింది. పరుగెత్తుతున్న వాళ్లెవరూ ఆ ఆజ్ఞను తిరస్కరించ లేక పోయారు. అందరూ ఒక్కసారి ఆగి పోయి చుట్టూ చూసారు.

కొండ శిఖరం మీద నిలుచున్న ఆకారాన్ని మొదట గుర్తించిన వ్యక్తి నోటినుంచి ఆశ్చర్యంతో కూడిన నిట్టూర్పు వెలువడింది.

"రాజ గారు!" అని అరిచారు అతను. దాంతో అందరూ తమ పాత రాజుగారిని గుర్తుకు తెచ్చుకున్నారు.

తన ప్రజల మీద పెరిగి పోతున్న కోపాన్ని అణుచుకోలేక పోయారు రాజా హూరీ కా బస్మీర్.

"నన్ను మోసం చేసారు. నేను లేకపోయినా మీ పొలాల్ని చక్కగా చూసుకో వలసిందని మిమ్మల్ని ఆజ్ఞాపించలేదా? ఆ ఎండి పోయిన పొలాలు యీ రాజ్యంలో ఉండ తగినవ అని అనుకుంటున్నారా?" అని కోపంగా అరిచారు రాజుగారు.

అంతటా నిశ్శబ్దం ఆవరించింది. కొండ గూడ గర్జించడం మాని వేసింది.

"ఈ సంవత్సరం పండించిన పొగాకు తీసుకు రండి" అని ఆజ్ఞాపించారు రాజుగారు.

ఎంతో మంది రాజుగారి ఆజ్ఞను పాటించ మొదలెట్టారు ఎంతో సిగ్గు పడుతూ పండిన కొద్ది పంటను రాజుగారి ముందు ఉంచారు.

రాజ గారు హూరీ కా బస్మీర్ ఆ పొగాకు వంక చాల సేపు చూసి, చివరకు "ఈ పర్వత ప్రాంతంలో మరోసారి మంచి పొగాకు పంటను చూసేంత వరకు మీ అవిధేయతను, సోమరితనాన్ని మరచిపోలేను" అన్నారు.

అలా అంటూ తన ముందుంచిన దారిలో పిడికెడు పొగాకు తీసుకుని ప్రజల దగ్గర

నుంచి వెనక్కి తిరిగి పిడికిలితో కొండను గుద్దాడు. పిడికిలి తగిలిన చోట పెద్ద రంధ్రం ఏర్పడింది. ప్రజలందరూ ఏడుస్తూండగా రాజుగారు అందులో దూరారు.

రాజు హరీ కా బస్కద్ ఇంకా కొండలో కాచుకుని ఉన్నారు ఆయన సంతోషంగా ఉన్నప్పుడు అక్కడి ప్రజలకు తాను ఇంకా అక్కడే ఉన్న సంగతి గుర్తు చేస్తున్నట్లు పొగాకు పొగ బయటికి పంపిస్తూంటారు. ఆ పొగ కొండ పైన వ్యాపించడం కూడా కనపడుతుంటుంది.



# వితంతువు గాడిదలు

చైనా జానపద కథ

పూర్వం చైనాలో తెలివి గల ఒక యువక వర్తకుడు ఉండేవాడు. అతను ధైర్యశాలి; అనేక ప్రదేశాలు తిరిగి చూశాడు. రాత్రుళ్ళు రోడ్డుపక్కనున్న వసతి గృహాల్లో విశ్రాంతి తీసుకునేవాడు. అతను ఎల్లప్పుడు దొంగలబారినుంచి ఆత్మరక్షణ చేసుకోవడానికి కత్తి దగ్గరే ఉంచుకొనేవాడు

ఒకరోజు కొండలగుండా దూరప్రయాణం చేసి అతను అలసిపోయాడు. అతని గాడిదలు కూడ వీపుమీద బరువులతో నిదానంగా నడుస్తున్నాయి.

"అయ్యో! పాపం! మీరుకూడ ముసలివాళ్ళయిపోయారు. మీకు విశ్రాంతినిచ్చి పచ్చికబయళ్ళలో మేయడానికి వదలివేయాల్సిన సమయం వచ్చింది" అన్నాడు అతను జాలిగా.

అదే సమయంలో ఒక ముసలివాడు కనిపించాడు అతనికి. వర్తకుడు ఆగమనడంతో అతను ఆగిపోయాడు.



"నమస్కారం; రోజంతా నడిచి అలిసిపోయాను. విశ్రాంతి తీసుకోవడానికి చుట్టుపట్ల ఏదయినా వసతిగృహం ఉందా?" అంటూ వృద్ధుడికి వినయంగా వంగి నమస్కరించి అడిగాడు వర్తకుడు.

వృద్ధుడు రోడ్డువైపు చూపిస్తూ: "నీవు ఆ మలుపు తిరిగితే చాలు. వితంయుపు చియాంగ్ వసతిగృహం కనిపిస్తుంది. ఈ చుట్టుపట్ల ఎక్కడా దొరకని మంచి భోజనం అక్కడ దొరుకుతుంది" అన్నాడు.

వర్తకుడి అలిసిపోయిన ముసలి గాడిదలను చూస్తూ కొంచెం ఆగి "ఆమె గాడిదలను కూడ అమ్ముతుంది. ఆమె వడ్డించిన భోజనంలాగే అవికూడ పేరు పొందినవే" అన్నాడు అతను.

అంత దగ్గరలోనే విశ్రాంతి సౌకర్యం లభిస్తుందని తెలుసుకొని సంతోషించి, వృద్ధుడికి మర్యాద పూర్వకంగా కృతజ్ఞతలు చెప్పి, వర్తకుడు ప్రయాణం కొనసాగించాడు.

కొద్దిసేపట్లో వృద్ధుడు చెప్పిన విశ్రాంతి గృహం చేరుకున్నాడు. చుట్టూ తోటలో అది పరిశుభ్రంగా ఉంది. ముందు మార్గంలోని రాళ్ళమీద నడుస్తున్న గాడిదల గిట్టల చప్పుళ్ళు వినబడడంతో ఒక ద్వారం తెరుచుకుంది. వాకిట్లో ఒక స్త్రీ చిరునవ్వుతో, "మీకు సాదరమైన ఆహ్వానం" అంది మధురంగా.

ఆమె వర్తకుడికి గాడిదలను కట్టివేసే స్థలం చూపించింది. ఆమెకు సేవకులెవరూ లేకపోవడంతో వర్తకుడే గాడిదలకు నీరు, మేత ఏర్పాటు చేశాడు.

గాడిదల సౌకర్యాలు చూసిన తర్వాత, దీపాలతో వెలిగిపోతున్న ఒక గదిలో అతను



[illegible] తింటూ. తాగుతూ వాళ్ళు ప్రయా [illegible] పర్వతాల్లోకూడ చాలాదూరం ప్రయాణం చేసాను. ఇంత సౌక [illegible]న్న విశ్రాంతి గృహాన్ని నేనెక్కడా చూడలేదు" అన్నాడొక ప్రయాణీకుడు.

"ఈ వితంతువు వంట కూడా సాటిలేనిదే" అన్నాడు మరొకడు పొట్ట తడుముకుంటూ, మెచ్చుకోలుగా.

"భారతదేశంలోను, పర్షియాలోను నేను చేసిన ప్రయాణాలన్నింటిలోనూ, ఇన్ని సౌకర్యాలు ఎవరూ సమకూర్చలేదు" అన్నాడు మరో వర్తకుడు.

వాస్తవానికి యువ వర్తకుడు అంతవరకు తిన్న వంటకాలన్నింటిలోకి ఆ యింట భోజనం చాలా రుచిగా ఉంది: రాత్రి భోజనం వడ్డించడంతోనే ప్రతి ఒక్కరూ అద్భుతమైన వంటలతో సుష్టుగా భోంచేశారు. పొట్టనిండా తిని పట్టు దిండ్లకు ఆనుకున్నారు.

తర్వాత వితంతువు గోధుమ పిండితో చేసిన కేకులు బల్ల మీద పెట్టించి. యువ వర్తకుడు తప్ప మిగతా ప్రయాణీకులందరూ సంతోషంగా వాటిని తిన్నారు. మరీ అలసిపోయి ఉండడం వలన యువవర్తకుడు వాటిని తినకుండా, ప్రయాణీకుల దగ్గర సెలవు తీసుకొని నిద్రపోవడానికి ఏర్పాటుచేసిన పెద్ద గదిలోకి వెళ్ళాడు. అక్కడ వరుసగా చాలా పరుపులు పరచి ఉన్నాయి. మూలగా ఉన్న ఒకపరుపు చూసుకొని దానిమీద పడుకుని త్వరలోనే గాఢనిద్రలో మునిగిపోయాడు.

నిద్ర పట్టినకొద్ది గంటలకే అలుగకీస్తున్నట్లున్న వింత శబ్దాలకు అతనికి మెలకువ వచ్చింది. కత్తి చేతిలో పట్టుకొని పరుపుమీంచి ఇవతలకు దూకాడు. చుట్టూరా ప్రయాణీకులందరు ప్రశాంతంగా నిద్రపోతున్నారు. అలా నిశ్చలంగా ఒక క్షణం నిలబడ్డంతో మరోసారి గీరుతున్నట్లు సన్నని శబ్దం వినబడింది.

"దొంగలొచ్చారు. నిస్సహాయురాలైన వితంతువుని దోచుకోవడానికి వచ్చిన పిరికి పందల పని పడతాను" అనుకున్నాడు.



మెల్లిగా బయటకి వెళ్ళి కిటికీలోంచి ప్రక్క గదిలోకి తొంగి చూశాడు. అక్కడ చూసిన దృశ్యం అతనికి ఆశ్చర్యం కలిగించింది. గదిలో ఒక స్త్రీ ఆకారం మాత్రమే నిలువుని ఉన్నది. మంచం క్రింద నుంచి పెద్ద పెట్టె బయటకు లాగి దానిపై వంగి ఉన్నది. పొడ వాటి ఆమె వెంట్రుకలు భుజాల మీద పాముల్లాగా మెలికలు తిరిగి ఉన్నాయి.

వింతగా ఉన్న ఆ స్త్రీ కిటికీవైపు తిరగడంతో అతను భయంతో వెనక్కు అడుగు వేసాడు. ఆమె వాడి కళ్ళు చీకటిలో పరిశీలనగా చూస్తూంటే భయంతో అతను ఇంకా వెనక్కు వెళ్ళాడు.

"ఓ! యీమె వితంతువు చియాంగే!" అని అతను ఆమె ముఖం గుర్తుపట్టి, ఆశ్చర పడి కిటికీనుంచి ఇంకా దూరంగా వెళ్ళాడు. "ఆమె ముఖం ఎంత క్రూరంగా వుంది. ఆమె ఏం చేస్తుందో చూడాలి" అనుకున్నాడు.

ఆ వితంతువు మళ్ళీ పెట్టె వైపు తిరిగి చిన్న కొయ్య గుర్రాన్ని, కొయ్య మనిషిని, చిన్న నాగలిని దానిలోంచి బయటకు తియ్యడం చకితుడయి ఆ వర్తకుడు గమనిస్తూనే ఉన్నాడు. తర్వాత ఆమె క్రిందకు వంగి ఏవో కఠోరమైన మాటలు పలికింది. వర్తకుడు తను నిలుచున్న చోటునుంచి ఆమె మాటలు స్పష్టంగా వినలేకపోయాడు.

ఆమె స్వరం పెద్దది కావడంతో కొయ్య ఆకారాలు కదలడం మొదలెట్టాయి. ఇంత లోనే ఆ గది తిన్నని చాళ్ల చాళ్లగా దున్నబడటం మొదలైంది.

ఆ తర్వాత వితంతువు కొయ్య బొమ్మలను పెట్టెలో ఉంచి గుప్పిళ్లతో నేల అంతా విత్తనాలు చల్లింది.

వర్తకుడు నోరు తెరుచుకుని చూస్తున్నాడు. మంత్రశక్తి గల ఆ విత్తనాలు భూమి మీద పడడంతోనే గోధుమ మొక్కలు మొలవ సాగాయి. త్వరలోనే ఆ గది అంతా బంగారు రంగు మొక్కలతో నిండి పోయింది.

ఇంతవరకు జరిగిన సంఘటనలన్నీ ఎంత వేగంగా జరిగిపోయ్యా అంత తొందర గానే ఆ వితంతువు పంట అంతా మార్చి ధాన్యాన్ని పిండిగా విసరింది.

"ఆ! మంత్రశక్తి గల నా గోధుమ కేకలను తయారు చేయడానికి ఇప్పుడు కావలసి నంత పిండి" అనుకుంది ఆమె తృప్తిగా.

ఆలోచిస్తూ వర్తకుడు తన పరుపు దగ్గరకు తిరిగి చేరుకున్నాడు ఆ గోధుమ కేక్ లలో ఏ మంత్ర శక్తి ఉందో అని ఆలోచిస్తూ నిద్రపోయాడు.

మరునాడు ఉదయం తన పరుపు మీంచి నిర్దాక్షిణ్యంగా త్రోసి వేయ బడ్డాడు. నేల మీద పద్ధతో గాడిదలు ఓంద్ర పెట్టడం వినిపించింది. లేచి చుట్టూ చూసాడు. అనేక రకాల ఆకారాల్లో ఉన్న గాడిదలతో గది నిండిపోయి ఉంది.

"అయితే యీ ప్రయాణీకులంతా ఏరి?" అనుకున్నాడు అతను. తక్షణం అతనికి రాత్రి జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది. "ఆహా! యీ వితంతువు ఎంత మోసగత్తె! ఈ ప్రయాణీకులందరికీ మంత్ర శక్తిగల గోధుమ కేకలు పెట్టి వారిని గాడిదలుగా మార్చింది" అని ఆశ్చర్యపడ్డాడు.

ఎంతో సేపు తీవ్రంగా ఆలోచించి తన వస్తువులు తీసుకొని శలవు తీసుకుందామని వితంతువు దగ్గరకు వెళ్లాడు.

"అల్పాహారం తీసుకోవడానికి నాకు వ్యవధి లేదు అయినా నీ దగ్గర ఉన్న అద్భుత మైనే గోధుమ కేక్‌లు మార్గ మధ్యంలో తినడానికి ఇస్తావా?" అ డిగాడు.

ఆమె త్వరత్వరగా వర్తకుడి కోసం కొన్ని మంత్ర శ గల కేక్‌లను పొట్లం కట్టి ఇచ్చింది. ఆమె దయకి కృతజ్ఞతలు చెప్పి, తిరుగు ప్రయాణంలో మళ్లీ నని చెప్పాడు అతను.

కొన్ని రోజుల తర్వాత అతను ఆ విశ్రాంతి గృహానికి మళ్లీ నెమ్మదిగా తలుపు తట్టాడు.

తలుపుముందునుంచున్న వ్యక్తిని చూసి ఆ వితంతువు ఆశ్చర్యంతో రు తెరిచింది.

"ఆ! కొన్ని ఆశ్చర్యకరమైన పనులు చేయడం ఇప్పుడు నావంతు" నుకున్నాడు వర్తకుడు.

సంతోషంగా ఆమెకు అభినందలు చెపుతూ "మళ్ళీ ఇక్కడికి రావడం నాకు సంతోషంగా ఉంది. నీచేతి వంట రుచి చూసే భాగ్యం నాకు కలగలేదు. నీవు నాకు ఇచ్చిన కేక్‌లు మార్గంలో కలిసిన మరి కొంతమంది ప్రయాణీకులు తినేశారు" అన్నాడు అతను.

వర్తకుడు గాడిదగా మారకపోవడానికి కారణం అప్పటికి గ్రహించి "మీరు ఆకలితో బాధపడ్డందుకు నాకు చాలా విచారంగా ఉంది" అంది ఆమె సానుభూతితో. "మీ కొరకు మరిన్ని క్రొత్త కేక్‌లు చేసాను" అని విషపూరితంగా నవ్వింది.

"మంచిది, నీవు కూడా నా దగ్గరున్న కేక్‌లు రుచి చూడాలి. వీటిని యీ దేశంలో పేరు పడ్డ వంటవాడు తయారు చేసాడు. ఎలా ఉన్నాయో చెప్పాలి" అన్నాడు ఆ తెలివి గల వర్తకుడు.

"అలాగే" అంటూ అతనికి టీ తీసుకు రావడానికి వెళ్ళింది ఆమె. "నా మంత్ర శక్తి గల కేక్‌లు ఈ మూర్ఖుడికి పెట్టడానికి ఇంకొంచం సమయముంది" అనుకుంది ఆమె.



ఆమె టీ తీసుకు రావడానికి వెళ్ళినప్పుడు మునుపు తాను అక్కడినుంచి వెళ్ళినప్పుడు ఆమె ఇచ్చిన కేక్‌లతో ఒక డజను తన సంచీలోంచి తీసాడు వర్తకుడు. మామూలు కేక్‌ను ఒకదాన్ని వాటి మధ్య పెట్టాడు.

వాళ్ళిద్దరూ టీ త్రాగుతూ కూర్చున్నప్పుడు వర్తకుడు రుచిచూడమని వితంతువుకి కొన్ని కేక్‌లు ఇచ్చాడు. ఆమె ఒక కేక్ తీసుకుంది. వర్తకుడు మామూలు కేక్ జాగ్రత్తగా ఎంచుకొని తినడం మొదలెట్టాడు.

"చాలా బావున్నాయి. ఇలాంటి వాటిని చేసానని చెప్పుకోడానికి గర్వపడతాను" అందామె ఆశ్చర్యంతో.

ఆమె మరో కేక్‌ను తీసుకుంటుంటే వర్తకుడు నవ్వుకున్నాడు.

ఆమె రెండో కేక్ తిన్న తర్వాత, "ఇవి నీకు నచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది ఇవి నీవు చేసిన కేక్‌లే" అన్నాడు అతను వితంతువుతో. భయంతో గజగజలాడుతూ, "అదెలా సాధ్యం?" అందా వితంతువు.

"నీ గోధుమ కేక్‌ల రహస్యమూ నాకు తెలుసు. నీ దగ్గర సరిక్రొత్త గాడిదలు అమ్మకానికి ఎలా లభిస్తాయో కూడ నాకు తెలుసు" అని జవాబు చెప్పాడు అతను.

ఆ వితంతువు గొంతు కోపంతో పూడుకు పోతుండగా కొంచెం సేపు ఆగి, "నీకు తగినవే తింటున్నావు" అన్నాడు వర్తకుడు.

కోపంతోను, భయంతోను కేకలు వేసింది ఆమె. కాని అప్పటికే ఆమె చెవులు పొడవుగా సాగి బూడిద రంగుగా మారిపోయాయి కొద్దిసేపట్లో కోపంతో నిండిన ఆమె పూర్తిగా మారిపోయింది.



# కొయ్య ఏనుగు

శ్రీలంక జానపద కథ

పూర్వం చందపజోత అనే రాజు ఉండేవాడు. అతను సంపన్నుడు, దురాశాపరుడూ. తీరికసమయమంతా తనకున్న సంపదలను చూస్తూ గడపేవాడు. ధనాగారంలోని డబ్బును, తనకున్న ఏనుగులను లెక్క పెట్టడం కంటే మరేది అతనికి సంతోషం కలిగించేది కాదు. చందపజోత పరిపాలించిన కాలంలో ఒకవ్యక్తి సిరిసంపదల్ని అతని దగ్గిరున్న ఏనుగులనిబట్టి అంచనా కట్టేవారు.

ఒక రోజు తన మంత్రితో షికారుకి వెళ్తూ, నిజానికి నేను చాలా అదృష్టవంతుణ్ణి. బహుశః ఈ ప్రపంచంలో నేనే సంపన్నుడనైన రాజును" అన్నాడు చందపజోత.

"కాదు, మహారాజా, మన పొరుగు రాజ్యాధిపతి ఉదేన ఎంతో సంపన్నుడు అతనితో పోలిస్తే మిగిలిన వారందరూ పేదవారు అనాలి" అని జవాబు చెప్పాడు మంత్రి. చందపజోత గర్విష్ఠి, కోపిష్ఠి. అంచేత మంత్రి ఎంతో ధైర్యవంతుడు కాబట్టే యిలాంటి జవాబు చెప్పగలిగాడు.

ఈ మాటలు విని రాజుగారికి చాలా కోపం వచ్చింది. అసంతృప్తితో చిరు బురులాడాడు. "అదెలాగు? రాజు లందరిలో నేను గొప్ప యోధుణ్ణి కాదా? నా కంటె ఎవరి దగ్గర ఎక్కువ సిరిసంపదలు ఉన్నాయి?" అని అడిగాడు అసహనంతో

యౌవనవంతుడైన ఆ రాజు దగ్గర ఒక మంత్ర శక్తి ఉన్నది. దాంతో అతను ప్రపంచంలో ఏ ఏనుగునైనా బంధించ గలడు. అతని వీణ నుంచి వెలువడే మధుర గానం వరుగెత్తే ఏనుగులను ఎన్నిటినో నిలబెట్టింది" అని జవాబు చెప్పాడు మంత్రి.

తన కంటె మరొకరికి ఎక్కువ ఏనుగులున్నాయనే మాట భరించ లేక పోయాడు చండపజోత. వెంటనే ఆ మంత్రి శక్తి నేర్చుకోవడానికి ఒక పథకం ఆలోచించడం మొదలెట్టాడు.

చాలారోజుల తర్వాత తన రాజ్యంలోని బుద్ధిశాలురు అందరినీ పిలిపించి ప్రాణం ఉన్న ఏనుగులు, గుర్రాల కన్న వేగంగా పరుగెత్తే బోలుగా ఉండే కొయ్య ఏనుగును నిర్మించమని ఆజ్ఞాపించాడు.

మాయ ఏనుగు సిద్ధంకాగానే రాజు దాన్ని చూడటానికి వెళ్ళాడు. "బాగుంది. అరవై మంది పరాక్రమవంతులైన యోధులు ఇందులో కూర్చోండి" అన్నాడు.

అరవై మంది యోధులు అందులో కూర్చున్న తర్వాత దాన్ని ఉదేన పరిపాలిస్తున్న రాజ్యం పొలిమేరల్లోకి తీసుకువెళ్ళారు.

ఉదేన రాజ సైనికుడొకడు ఈ వింత జంతువును చూడ్డం తటస్థించింది. అతను తాను చూచిన ఏనుగుని గురించి చెప్పడానికి రాజ భవనానికి వెళ్ళాడు. ఉదేనకు ఆసక్తి కలిగింది. మంత్రి శక్తి గల తన వీణను తీసుకొని ఆ ఏనుగును పట్టుకోవడానికి బయలుదేరాడు.

అతను దాన్ని చూడగానే అది చండపజోత రాజ్యం వైపు పరుగెత్త సాగింది.

ఉదేన మంత్రం చదివి మహిమ గలిగిన తన వీణ వాయించాడు కాని అన్నీ నిరుపయోగమైనాయి. ఆ కొయ్య ఏనుగు పరుగును ఏవీ ఆపలేక పోయాయి.

"నా వీణానాదం విని ఆగ లేదంటే ఇది వింత ఏనుగై ఉంటుంది. ఇది తప్పించుకు పోకుండా చూడాలి" అనుకున్నాడు రాజు.

తన గుర్రాన్ని అదిలించి ఏనుగు వెంట పడ్డాడు. ఎన్నో మైళ్ళు వెంబడించాడు. అయినా గుర్రం ఏనుగును చేరుకోలేకపోయింది. అతను దేనిని అంత తేలికగా విడిచి పెట్టే స్వభావం కలవాడు కాదు. ఆ ఏనుగు దానంతట అది ఆగి పోయేంతవరకు దాన్ని వెంబడిస్తూనే ఉన్నాడు. చివరకు ఆ ఏనుగు దానంతట అది ఆగిపోయింది.

అతను తన గుర్రాన్ని ఆపి ఆపగానే చండపజోత పంపిన యోధులు ఆ ఏనుగులోంచి బయటికి వచ్చారు.

ఏనుగు పొట్టలోంచి యోధులు బయటకు దూకడాన్ని చూచిన ఉదేన ఎంతో ఆశ్చర్య పోయాడు!

"ఏం జరుగుతున్నదో తెలుసుకునేలోపే అతనిని చండపజోత యోధులు బంధించి తమ రాజుగారి దగ్గరకు తీసుకు పోయారు. తనను మోసం చేసారని తెలుసుకొని ఉదేన ఉగ్రుడై పోయాడు.

"ఇంత నీచంగా నన్నెందుకు బంధించారు?" అని అతను తనను పట్టుకొన్న వారిని అడిగాడు.



తన మాయోపాయం నెరవేరినందుకు చండపజోత సంతోషించాడు.

చండపజోత క్రూరంగా నవ్వుతూ, "నీకేదో మంత్రం తెలుసట. అది నీవు నాకు నేర్పితే ఎటువంటి హానీ లేకుండానే నీ రాజ్యానికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు యువకుడు. అందగాడు అయిన ఉదేనను ఉద్దేశించి.

ఉదేన కొన్ని క్షణాలు ఆలోచించి సమాధానం చెప్పాడు, "ఆ మంత్రం ఉపదేశిస్తాను. కాని విజ్ఞానవంతుడైన నీ గురువును గౌరవించినట్లు నన్ను గౌరవించాలి" అన్నాడు.

ఆశ్చర్యంతో చండపజోత నోట మాట రాలేదు. తన జీవితంలో ఇంతవరకు అందరూ తన కంటే అధములు అనుకున్నాడు. ఏనుగు ఎగరడం ఎంత అసంభవమో అలాగే చండపజోత ఎవరినైనా గౌరవించడం కూడ అంతే అసంభవం.

"నిన్ను గౌరవించే వారికి ఎవరికైనా ఆ విద్య నేర్పుతావా?" అని అడిగాడు ఉదేనను.

"అవును" అన్నాడు ఉదేన.

దాంతో చండపజోతకు ఒక ఆలోచన కలిగింది. అతనికి వాసులదత్త అనే అందమైన కుమార్తె ఉంది. ఆమె యీ విద్య నేర్చుకోవచ్చును అనుకున్నాడు. కానీ ఆమె అందగాడైన ఉదేన ప్రేమలో పడుతుందేమోనని భయపడ్డాడు. గడ్డం నిమురుకుంటూ కొంచెం సేపు తీవ్రంగా ఆలోచించాడు. చివరికి ఒక పథకం ఆలోచించాడు.

"నాకొక గూని కుమార్తె ఉన్నది. నీవు కోరినట్లు ఆమె గౌరవిస్తుంది. దానికి మారుగా ఆమెకు ఈ విద్య నేర్పాలి" అన్నాడు చండపజోత.

అందుకు ఉదేన సంతోషంగా ఒప్పుకున్నాడు.

"ఆమెకి గూని వుందని సిగ్గు. నీవు ఆమెకు విద్య నేర్పేటప్పుడు ఆమెకూ నీకూమధ్య ఒక తెర వుంటుంది" అన్నాడు చండపజోత.

షరతులన్నిటిని అంగీకరించాక చండపజోత తన కుమార్తె దగ్గరకు వెళ్ళి ఏం చేయాలో ఆమెకు చెప్పాడు. "నీకు విద్య నేర్పే వ్యక్తి కుష్ఠు వ్యాధితో బాధపడుతున్నాడు. అందువల్ల విద్య నేర్పేటప్పుడు అతను నీకు కనబడకుండా మీ మధ్య ఒక తెర అడ్డంగా ఉంటుంది"

మరునాటినుంచే ఉదేన వాసులదత్తకు మంత్ర విద్య నేర్పడం మొదలెట్టాడు. మొదటి రెండు రోజులు శ్రద్ధగా విని ఉదేన చెప్పిన మాటలన్నీ వల్లించింది ఆమె. మూడవ రోజు నుంచి శ్రద్ధపోయి దిక్కులు చూడటం మొదలెట్టింది. ముందు రోజు నేర్చుకున్న పాఠం జ్ఞాపకం ఉంచుకునేది కాదు. అంచేత తప్పులు చేయ సాగింది. చివరకు అది భరించ లేని స్థాయికి చేరడంతో ఉదేనకు కోపం వచ్చింది.

"ఓ గూని మొద్దు. ఇలాఅయితే వంద సంవత్సరాలయినా యీ విద్య నేర్చుకోలేవు" అని కేకలు వేశాడు ఉదేన.

తనను గూని మొద్దు అనడంతో వాసులదత్త కోపించి ఎదురు తిరిగి, "వికృతమైన కుష్ఠురోగి అయివుండీ నన్నుఅవమానించటానికి నీకు ఎంత ధైర్యం?" అని అంది.

ఆమె ఆ విధంగా అన్నందుకు కోపంతో కంపించి దెబ్బలాటకు సిద్ధమై మధ్య ఉన్న తెరను చింపి పారేశాడు ఉదేన.



పరస్పరం చూసుకుని వారు నిశ్చేష్టులయారు. చండపజోత చెప్పినట్లు ఇద్దరిలో ఎవరూ వికారులు కాదు ఉదేన చూసిన కన్యలందరిలోకి వాసులదత్త చాలా అందగత్తె. తక్షణం ఆమెని వరించాడు ఉదేన. వాసులదత్తకు కూడ అలాగే అనిపించింది. ఉదేన నిజానికి యువకుడు, అందగాడు.

కపటిమైన చండపజోత చేసిన మోసం త్వరలోనే ఇద్దరూ తెలుసు కున్నారు. ఉదేన తప్పించుకోవడానికి తన శక్తిమేర సహాయం చేయడానికి వాసులదత్త అంగీకరించింది.

తన తండ్రి విద్య నేర్చుకోవడం పూర్తి అయిందా అని తండ్రి అడిగినప్పుడల్లా వాసులదత్త త్వరలోనే సంపూర్ణంగా క్షుణ్ణంగా నేర్చుకుంటానని చెప్పేది. ఒక రోజు ఆమె. "నాన్నగారూ, విద్య పూర్తిగా నేర్చుకున్నాను దానివల్ల మంచి ఫలితాలు కలగడానికి మన రాజ్యంలో దూరంగా మూల ప్రాంతాలలో పెరిగే ఒక మూలిక కావాలి. అది ఉదేన రాజ్యం పరిహద్దులోనే దొరుకుతుంది" అంది.

చండపజోత ఆ విద్యను ప్రయోగించాలని అత్యాశలోవున్నాడు. అందువల్ల రాజ్యంలోని సింహ ద్వారంల్లోంచి రాజకుమార్తె ఎప్పుడు కావాలన్న పోనీయవలసిందని పరిహద్దున కాపలాఉన్న సైనికులందరి చెప్పాడు.

ఒక రోజు చండపజోత వేటకు పోయేంత వరకు ఉదేన, వాసులదత్త ఓర్పుతో వేచి ఉన్నారు. ఒక పంచినిండా బంగారు నాణాలు నింపుకొని బలిష్ఠమైన గుర్రంమీద ఎక్కి అంతః పురం నుంచి తప్పించుకు పోయారు.

వాళ్ళు పరిహద్దుకు చేరుకునే పమయానికి చండపజోత సైనికులు వెంబడిస్తూ దగ్గరకు వచ్చేసారు. ఉదేన బంగారు నాణాల పంచి విప్పి తన చుట్టూ నాణాలు విరజిమ్మారు. అతను ఊహించినట్లే చండపజోత సైనికులు తమరాజుగారిలాగే ధనవ్యామోహం గలవాళ్ళు. తక్షణం ఉదేనను వెంబడించడం మానివేసి బంగారు నాణాలు ఏరుకోసాగారు.



దాంతో ఉదేన వాసులదత్తతో సురక్షితంగా తన రాజ్యం చేరుకున్నాడు.

జరిగినదంతా తెలుసుకొని చండపజోత ఉగ్రుడై పోయాడు. కోపంతోనూ నిస్పృహ తోనూ చిందులు త్రొక్కాడు. ఉదేనకు ఏమీ హానిచేయలేక పోయాడు.



# అదృశ్యమైన గడ్డి కోటు

జపాన్ జానపద కథ

అనగా అనగా తూర్పున ఒక దూర దేశంలో, ఒక వింత గ్రామము ఉండేది. ఆ గ్రామములో ఉండే ప్రజలు వింతగా ఉండేవారు. వారిలో ఏ ఒక్కరికి సామాన్యంగా స్త్రీ పురుషులకు ఉండేలాగ తలలుండేవి కావు, కొంత మందికి పొడవైన బట్టతలలు, మరి కొంత మందికి గుండ్రని పెద్ద తలలుండేవి. మరి కొంతమంది వుండేవారు. తలలకు బదులు వాళ్ళ భుజాల మీద బంగాళా దుంపలు మొలిచాయా అన్నట్లు వింతగా వుండేవారు, అంతేకాదు వాళ్ళందరూ మంద మతులు అని కూడ పేరు మోసారు.

వారిలో ఒకడు పనికిమాలిన సోమరి. అతని పేరు ఓటోకో. అతను ఎప్పుడూ ఏదో ఒక తుంటరి పని చేస్తూ ఇరుగు పొరుగు వారిని బాధ పెట్టేవాడు. వాళ్ళు అతనికి తమ దగ్గ రున్నది ఏదో ఒకటి ఇచ్చేవారు. ఒక రోజున ఆ మూర్ఖపు వెధవ టెంగూమీద తన యుక్తులు ప్రయోగించాలని ప్రయత్నించడంలో అతని అల్లరి అతన్ని చిక్కుల్లో పడవేసింది.

టెంగూ ఒక వింత ప్రాణి. టెంగూ అంటే పొడవాటి ముక్కుగల పిశాచం అని అర్థం. నిజంగానే దానికి పొడవాటి ముక్కు ఉండేది. దాని వీపు వెనక ఈకలు నిండిన రెండు రెక్కలుండేవి. అది వింత దుస్తులు ధరించేది. దానికి మాయాశక్తులు కూడ తెలుసు. మూర్ఖులు మాత్రమే దాని మీద తమ యుక్తులు ప్రయోగించేవారు. అలాంటివారిలో ఓటోకో ఒకడు.

ఒక రోజు వెదురుతో గొట్టం చేసి దానితో ఏంచేయాలా అని ఆలోచించాడు ఓటోకో. మొదట దాన్ని రాళ్ళు విసరడానికి ఉపయోగించుదామనుకున్నాడు. తరువాత దాన్ని మంచి దూర దర్శినిగా వాడుకోవచ్చునను కొన్నాడు.

దాన్ని అతను కంటి దగ్గర పెట్టుకొని చూడగానే ఒక టెంగూ పిశాచం తన వైప ఎగిర రావడం కనపడింది.







"ఓహో! ఈ టెంగూ దాని అందమైన వరి గడ్డి కోటు నాకిస్తుందేమో చూద్దాము"
అని అనుకున్నాడు లోలోపల.

మాటి మాటికి, "ఓహో, ఆహా" అని ఆసక్తికరంగా అరుస్తూ వెదురు గొట్టంలోంచి
చూడసాగాడు. అన్ని టెంగూలలాగే యీ పిశాచానికి గూడా ఆసక్తి ఎక్కువ. ఓటోకో ఏం
చేస్తున్నాడో చూద్దామని అతనికి దగ్గరగా దిగింది. కీచుగొంతుతో ఒక్కసారి తననికూడా చూడ
నివ్వమని కోరింది.

"ఏమిటి? నా కోసరం ప్రత్యేకంగా చేసుకున్న దూరదర్శినిలోంచి నిన్ను చూడనివ్వ
డమా? వీలు పడదు" అన్నాడు బిగ్గరగా ఓటోకో.

"ఆహా, చందమామ ఎంత అందంగా ఉన్నాడు. నీకు కూడ చూడాలని లేదు టెంగూ?
దానిమీద వున్న ప్రతి మైదానం, లోయ కనిపిస్తున్నాయి" అని అస్పష్టంగా మాట్లాడుతూ
గొట్టం లోంచి మరోసారి చూసాడు.

పాపం టెంగూ చూడాలనే కోరికతో తహతహలాడింది.

"దయచేసి నన్నొకసారి చూడనివ్వవూ. ఒక్కసారి చూడనిస్తే నా అందమైన బూట్లు
కాని, మెరిసే నల్ల టోపీని కాని నీకు ఇస్తాను" అని ఆ టెంగూ ప్రాధేయపడింది.

"ఊహూ, వీల్లేదు. నీ కోటు ఇస్తే ఒకసారి చూసేందుకు ఒప్పుకోవచ్చు" అన్నాడు
ఓటోకో దురుసుగా.

ఓటోకో మనసు మార్చుకొనే లోపు ఆ తెలివి తక్కువ పిశాచం వెదురు గొట్టం లాక్కొని తన కోటును అతని చేతుల్లో పడేసింది.

ఓటోకో కాలి కొద్దీ పరుగెత్తాడు. అతను ఇచ్చిన దూరదర్శినిలోంచి చూస్తే గుండ్రని చిన్న ఆకాశము ముక్క మాత్రమే కనిపించడంతో తనకు దృష్టి దోషమో లేక తన మతి చలించిందోనని టెంగూ ఆశ్చర్యపడింది.

టెంగూ దృష్టికి అందకుండా దూరంగా పోగానే ఓటోకో కోటు తొడుక్కున్నాడు. అప్పుడు ఏమి జరిగిందను కున్నారు? అతను ఎవరికీ కనిపించకుండా అదృశ్యమయ్యాడు. సంతోషంతో రోడ్డు మీద గెంతుతూ తన గ్రామం చేరుకున్నాడు.

"ఎం తమాషా! ఓ! ఏమి ఆనందం! ఏమి ఆనందం!" అనుకున్నాడు ఓటోకో.

గ్రామంలోని ప్రజలను గుద్దటం, కింద పడేయటం ముక్కులు గిల్లడం, భయ పెట్టడంతో అతను ఎంతో ఆనందంగా కాలం గడిపాడు.

అదృష్టం కొద్దీ ఆ సమయాన ఆ ఊరిలో గొప్ప సంపన్నుడు వీధిలో నడుస్తున్నాడు. తన వేలికి పెట్టుకొన్న ఉంగరాన్ని చూసుకుంటూ అతను మురిసి పోతున్నాడు. వీధి మధ్యకు చేరగానే అతనికి తన ఎడమ చెవి ఎవరో గిల్లినట్లు అయింది. కోపంతో వెను తిరిగి చూడ్డంతో కుడి చెవి పట్టుకుని అవమానకరంగా అటూ యిటూ త్రిప్పడం జరిగింది. రెండు సార్లు తిరిగి చూసి దభీమని నేల మీద పడిపోయాడు అతను. అంత గొప్ప సంపన్నుడు బురదలో పడిపోవడం ఎంత తమాషాగా ఉందో! మొదట భయపడిన గ్రామస్తులందరూ తరువాత బిగ్గరగా నవ్వడం మొదలెట్టారు.

తాను చేసిన పనికి సంబరపడుతూ ఈల పాట పాడుకుంటూ తన దారిన వెళ్ళి పోయాడు ఓటోకో. కొద్దిదూరం పోగానే చంకలో పొట్లంతో శ్రామికుడొకడు కనిపించాడు. ఓటోకో త్వరగా అతని దగ్గరకు పరుగెత్తి పొట్లం లాక్కొని దానిలోంచి తెల్లని మేజోళ్ళు బయటికి తీసాడు. ఆ విధంగా మేజోళ్ళు లాక్కోబడి, ఒక్క విసురున వెళ్ళి బురదగుంటలో పడటంతో శ్రామికుడు హడలెత్తి పోయాడు.

"నా మేజోళ్ళకు దయ్యం పట్టింది" అని చాపుకేక పెట్టి వీధిలో పరిగెత్తాడు అతను.

తన యుక్తులు పారినందుకు ఓటోకో చాలా సంతోషించాడు. ఇంకా ఏంచేయాలా అని చుట్టూరా చూసాడు. అతని కళ్ళు ప్రాథమిక పాఠశాల వైపు మళ్లాయి. నేర్పుగా క్లాస్‌గదిలో దూర బడ్డాడు. ఉపాధ్యాయుడు గుమ్మం వైపు వీపుపెట్టి తిరిగి $2 + 2$ అని బోర్డుమీద నిదానంగా వ్రాస్తున్నాడు. అతను సమాధానం వ్రాయకముందే ఓటోకో ఐదు అని బోర్డ్ మీద వ్రాసాడు.

ఉపాధ్యాయుడు ఆశ్చర్యంతో తల గోక్కున్నాడు. పిల్లలు బోర్డు వైపు, తమ చేతుల వైపు మళ్ళీ బోర్డు వైపు తెల్లబోయి చూసారు. వారిలో కొందరు వ్రేళ్లతో లెక్కపెట్టారు.

"సమాధానం, నాలుగు అనుకుంటాను. కాని బోర్డ్‌మీద ఐదు అని ఉంది" అని ఉపాధ్యాయుడు గొణుక్కున్నాడు.

మరోసారి తల గోక్కొని, "నా మెదడు చెప్పేది నిజమనుకునేదా లేక బోర్డ్ మీద వ్రాసిందా?" అనుకున్నాడు

"సమాధానం ఐదు" అని ఓటోకో అతని చెవిలో మెల్లిగా చెప్పి గలగల నవ్వుకుంటూ గది నుంచి బయటకు వెళ్లాడు.

ఓహ్! క్లాసు గదిలో ఎంత అయోమయం సృష్టించాడనుకున్నారు! "నాలుగు" "కాదు ఐదు" "నీ మొహం. ఆరు" అని అంటూ పిల్లలు కేకలు వేస్తూ ఒకరితో ఒకరు దెబ్బలాడుకుని ఏడవడం ప్రారంభించారు.

ఒక లావాటి పిల్లవాడు రెండు చేతులతో రెండు వేళ్లు చూపించి, "ఇవి ఎన్ని?" అని అడిగాడు.

"ఎనిమిది. నీచేతి వేళ్లు లావుగా ఉండటం వల్ల ఒక్కొక్కటి రెండిటితో సమానం" అని బిగ్గరగా అరిచాడొకరు. అలా అని నాలుక వెళ్లబెట్టి వేళాకోళం చేయడంతో లావుపాటి పిల్ల వాడు కోపంతో అరిచాడు.

ఈ చిలిపి పనులు చేసిన తర్వాత విశ్రాంతి తీసుకోవడానికి ఇంటికి వెళ్లాడు ఓటోకో. సాయంత్రం చేయబోయే సాహస కార్యాలముందు కాస్త విశ్రాంతి తీసుకుందామని కోటు తీసి వేసాడు. అతను నిద్ర పోతుండగా అతని తల్లి లోపలికి వచ్చి కుర్చీ మీద వేలాడుతున్న కోటుని చూసింది.

"ఎంత మురికిగా ఉందీ కోటు" అని విసుక్కుంటూ, వంట గదిలోకి తీసుకుపోయి, దానిని మంటల్లో వేసింది.

తన తల్లిచేసిన పనికి ఓటోకోకు వెర్రికోపం వచ్చింది. కోటుకాలిన బూడిద పోగు చేసి తోటలో ఒక మూలకు వెళ్లాడు. బూడిద వళ్లంతా పులుము కోవడం ప్రారంభించాడు. క్రమంగా అతను మాయమవసాగాడు. పూర్తిగా మాయమవగానే గ్రామం వైపు వెళ్లాడు. వసతి గృహాల నుంచి నవ్వులు, మాటలు వినిపించాయి. వంటకాల ఘుమ-ఘుమ వాసన రావడంతో కడుపులో నకనక ఆకలి వేసింది. రద్దీగా ఉన్న వసతి గృహంలోకి వెళ్ళి, అక్కడ ఉన్న వాళ్లందరూ రుచిగా ఉన్న వంటలు ఆరగించేంత వరకు వేచిఉన్నాడు. అప్పుడు పులుసు ఉన్న పాత్ర దగ్గరకు వెళ్ళి దాన్ని ఆత్రంగా ఆరగించడం మొదలెట్టాడు. గృహ యజమాని కుక్క వాసన పట్టి అతని గడ్డం నాకింది.

కుక్క గాలిలో ఏమి నాకుతుందో చూడటానికి అందరూ వెనక్కు తిరిగారు. పులుసు పాత్రకు దగ్గరలో ఆత్రుత త్రాగుతున్న శబ్దం వినిపించింది వాళ్లకు. పొడుచుకు వచ్చిన రెండు ఎర్రని పెదవులు కనిపించాయి. పులుసు ఆ పెదవుల నుంచి కారుతోంది పెదవులకు దిగువ గడ్డం. ఆ తర్వాత ఎర్రని ముక్కు కనిపించాయి. ఆ దృశ్యం చూస్తున్న వాళ్లంతా ఆశ్చర్యంతో చకితులయారు.

"ఇదేదో భూతం" అని కేక వేసాడొకరు.

"నా వంటలను తిన్న ఏ భూతం కూడ తప్పించుకో లేదు" అంటూ యజమాని అక్కడ ఉన్న కర్ర తీసుకొని మొఖం కనిపించని ఎర్రని ముక్కుమీద కొట్టాడు. ఓటోకో భయపడి మొర్రో అని ఒక్క గెంతు గెంతి బయటికి పరుగెత్తాడు. దాంతో అందరూ అతని వెంట బయటకు పరుగెత్తారు. అందరికంటె ముందు యజమాని పరుగెత్తసాగాడు.

రోడ్డు మీద పరుగెత్తడంతో ఓటోకోకు చెమట పట్టింది. తత్ఫలితంగా ప్రమాదం సంభవించింది. సంగతేమిటంటే ఆ బూడిద పొడిగా ఉన్నంతవరకు బాగానే ఉంటుంది. తడి తగలగానే దాని మంత్రశక్తులన్నీ మాయమవుతాయి.

కాస్సేపటికి పరుగెత్తుతున్న ఓటోకోకు చెమట దిగ కారడంతో అతను వగం పేసిన

చిత్రంలాగా కనుపించడం మొదలెట్టాడు. ఎంతో భయపడిపోయి మరింత వేగంగా పరుగెత్తి ఒక ప్రవాహం మీద ఉన్న వంతెన చేరుకున్నాడు. అక్కడి నుంచి ప్రవాహంలోకి చూశాడు.



తక్షణం వెనక పరుగెత్తిన జనం వంతెన మీదుగా తొంగి చూసి వంటకాలు తింటున్న భూతం ఓటోకోయేనని తెలుసుకున్నారు.

పాపం ఓటోకోను బయటకు లాగి అతని నోటితోనే జరిగిన కోటు కథ విన్నారు. అందరూ విరగబడి నవ్వారు.

"ఓరి పిచ్చి మొద్దూ కొంగా దగ్గర నీ యుక్తులు పారవని నీకు తెలియదూ? వాటి వ్యవహారాల్లో ఎప్పుడూ ముక్కు దూర్చకూడదు. వాటి ముక్కులో నీ ముక్కు సగంకూడ లేదు" అని నవ్వారు వాళ్ళందరూ.

ఆ తరువాత చాలా రోజులవరకు గ్రామప్రజలు ఆ సంఘటన చెప్పుకుని నవ్వుకున్నారు.



Printed at: Japan Art Press, New Delhi-110028